శ్రీ రస్తు.

శ్రీవిఘ్నరాజాయనమః.

# ప్రియంవదా చరిత్రము





ఇయ్యది

అనకాపల్లి నివాసుండునగు

శ్రీమద్భారద్వాజసగోత్రోద్భవ కేశవరామపుత్రుండగు

బి. బాలాజీదాసు నిచే రచియింపఁబడి



ఏతద్గ్రంథకర్తవలన స్వాతంత్ర్యంబు వడసిన

రాజమహేంద్రపురనిలయులగు

శాళహాస్తి వీరయ్యగారి పుత్రుండగు

తమ్మారావుగారిచే

ప్రచురింపఁబడియె.

ఏడవకూర్పు ప్రతులు 1000

రాజమహేంద్రవరము.

శ్రీవిద్యానిలయముద్రాక్షరశాలలో ముద్రింపఁబడియె.

రెటు] [దీని వెల ౩ అణాలు.

చదువరులారా!

ఇందుల తప్పుల నొప్పులుగా జేసికొని యుపయోగించు కొనుఁడు.

### చంపకమాలిక.

ధరవర రాజమహేంద్రి పురధాముఁడు శ్రీశివగోత్రపావనుం
డురుతర కాళహస్తి సుకులోద్భవుఁడై యల వీరయాఖ్యసుం
దర సుకుమార సూనుఁడు సదా శివభక్తుఁడు సమ్మరావు సా
దరమున నచ్చువేసి విదితంబుగ నమ్ముదునంచు గోరఁ బం
ధురత పతివ్రతా మహిమతో విలసిల్లెడు శ్రీప్రియంవదా
చరితము గానరూపమున చక్కని నూతన వర్ణమట్లతో
పరమ ముదంబెసంగ కృతబాలశశాంకున కంకితంబుగా
సరసుల మానసంబులకు సంతసమొప్ప రచించి యిచ్చితిన్.

**B. Balajeedass**

*Anakapally.*



# ప్రియంవదా చరిత్రము

శా. శ్రీమద్విష్ణుకుశేశయాసనభవ శ్రీభారతీ పార్వతీ
సోమార్కద్విరదాస్య దేవవిభు న్ జోరున్మయూరు ప్రదా
భీమన్యాయవి భాస్కరాదికవుల న్ప్రేమింతు నశ్రాంతము
న్నామిన్ శ్రీకృతివృద్ధిబొందుటకు నంభోజారితారార్కమై.

గురుప్రార్థన.

కం. తగనాంధ్రభాషఁ గరపిన, తగవరి పోటూర్నరుకులసుధావార్ధివిధుఁ
డగు వేంకటసామి మదీయగురుని మదిలోఁ దలంతు ననవరతంబున్

కవివంశావళి.

సీ. ఫలసస్యవృద్ధిసద్వ్యాపారములచేత మనుతిక్కపల్లిగ్రామనిలయుఁ
గుకుభరద్వాజసద్గోత్రపావనప్రభుడు లక్ష్మణదాస పౌత్రకుఁ
రహిమీర కేశవరామాఖ్యునకు కన్నమాంబకు నేద్వితీయాత్మజుఁ
విశ్రుతగానప్రవీణుఁడౌ బాలాప్రసాదుగారికి నేసహోదరుఁడ

గీ. శైలజాహృదయాబ్జభాస్కరకటాక్ష
వీక్షణాలబ్ధగానకవిత్వయుతుఁడ
శ్రీరమేశ కథాబోధనారతుండ
నరయ బాలాజిదాసనామాంకితుండ.

సభావందనము.

హిందూస్తాని భయిరవి ఆదితాళం

సభాసదులారక కు । సంతసంబున దల్పెద ॥సభా॥
శుభంబుగనువినుడీ శ్రీప్రియంవదా । శుభచరిత ముహాతదురిత

రసభరితము॥ వ॥ పిల్లలపల్కులు కల్లులువినితను। యుల్లమందు నంత సిల్లి నగతిమిరా। పిల్లడ నానుడువులలో పలకడు। బాలులు నుండాను బాల్యాగ వాటిని। తల్లిదండ్రియు నొప్పాలగొని మది సంతోషింపుడు। భావింపుడు। దీవింపుడు ॥సభా॥

వ॥ మఱియు నీశ్వరునిచే సృజింపబడిన యీభూలోకమునం గల సమస్తజీవరాసులలో॥

క. మానవజన్మప్రశస్తంబై, నెగడె ప్రపంచధర్మ మరసి యీశ్వర ధ్యానమొనర్పంగ నిర్మల, మానసములు వెలయ కలసమాహితులారా

హిందూస్తానీకాపి ఆదితాళము.

౧. దేవునిస్మరియించండి, మో। దావహాపునినమ్మండి భక్తావనాసక్తుండండి కడు। బావనుడతడుసుమండీ॥

౨. తనువుశాశ్వతంబండి, యీ। ధనరాసులుకల్లండి, సతి తనయులు వెఱరారండి, భువి। ధర్మమేజయంబండీ॥

౩. త్రికరణశుద్ధిగనండి లో। కికమునెరిగి మనండి, పా తకములకోదోలండి, జ। నస్మిక్కృతార్థంబిదినండి ॥మం॥

~~౪. బాలాజీదాసునిదండి~~, గా। నేలినట్టిఘనచండి, కా లోలునిస్మరియించండి, తడ। వేలను మనవివినండి, రండి॥

వ. మొదట నిర్మలహృదయంబుగలుగుటకొఱకు యత్నించవలయు. నిర్మలత్వంబు గలుగుటకై.

గీ. సాధుసంగంబు సకలార్థసాధకంబు॥

వ. అట్లలోకోక్తి కలదుకాన సజ్జనగోష్ఠి యేకభక్తికి మూలముగనుక,

కాంభోజి ఏకతాళము.

పరమేశునికృపగనుగొన, పాటుపడుడి నరులారా ॥ప॥

౨ సురత్రములుభువిని। నిరతములుగావు

దురితములుపోలు। చరితములువినుచు ॥ప॥

3 స్థిరులై, గురుచరణసేవాచతురులై, ప్రసాదితమంత్రో
చ్ఛరులై, జనితానందరసమధుకరులై, పట్నత్రుంమెడలకు
నరులై, పంచేన్ద్రియపంకజకరులై, మాయాతిమిరదివా
కరులై, సంసారజలజదళకరులై, కుమతిపవనదర్వీకరులై
దీనమనుజశ్రేమకరులై, పాపగజవిఘాతికేసరులై
పాలింబాలాజికింకరులై, భువినరులైపుట్టి ద్వారలై ॥పర॥

వ- ఇటుల దేవునిగూర్చి పాటుపడక నశాశ్వతంబగు యిహ
సౌఖ్యంబు స్థిరముని మోహాంధకారమున పామరులై.

సీసార్థము.

యదుకులకాంభోజి ఆటతాళము.

సంసారమను నాన్గునందులోపలజిక్కి ఘనమోహమనునట్టి
గంతవలన మార్గంబుదెలియక మనలకయు న్నను కాలమనెడిముని
కోలపోటువలన దిరుగుబలీవర్దముభంగిని చరియించుచున్నాము జడు
లమగుచు। నట్టియజ్ఞానంబుఁ బుట్టనెయ్యక నిత్యపదవి నొసగుగాన
పదములగుచు వాసిమీరంగమనమ్మున,

దాసపోషకున్వేడుడి, వెంట, కాసైనరాదునుమీ ఆనలోపల
జిక్కి యతివలవలఁజొక్కి। వాసిమీరగయముని, పాశముళోదక్కి॥

గాసినొందగనేల కాలుని, మోసమునకిదివేళపాపరాసులడఁ
గుగాన నామాటవినుమీ పూటచనకెవ్వేట బాలాజీ ॥దాసపో॥

వ. ఇట్లుచేయక దారాసుతోదర పోషణార్థమై విశేషదుష్కా
ర్యము లొనర్చెడువారికి.

కాంభోజిరాగము ఆదితాళము.

పరమపదవిడిక్కన, యశముదక్కన గర్విక్కన ॥పర॥

ఆ ధరణిలోన బాలాజీవరదుని స్మరింపక, వేదంశ సకరింపక॥పర॥

క పలలము దిని కల్లు సారా విస్కీ వైన్బ్రాందులందాగి ధనము గలదంచువిఱ్ఱవీగి,సరసులమనకడుజులరేగి, వెలవాలదులయిండ్లకు నేగి, మోహజలనిధిందొప్పదోగి, ప్రభువులదరి కొండెములువాగి, మాయల జేసి డబ్బులాగినవారికి ॥పర॥

ఈ క్షోణిని న్యాయమునదీర్చెడి యుద్యోగులమని కోటులువేసి, యజమానిశాసనముద్రోసి, యభిమానములావలద్రోసి బకధ్యాన శతంబులు జేసి, కొరగానలంచములు మేసి, వినరానిసాక్ష్యములు గూసి కడుదీనులకొంపలు దీసినవారికి ॥పరమ॥

వ. కావున నిట్టి మాయలం జేయక న్యాయార్జితవిత్తంబుచే తద్దానలందీర్చుకొని బుధజనసేవ యొనర్చి దేవుని గొనియాడిన శాశ్వతానందంబొసంగును. ఈశ్వరపాదారవింద ధ్యానానురక్తులగు వరరుచిప్రియంవదలను వధూవరులు కట్టిడుములుబొంది శంకరానుగ్రహంబున విపదబ్ధిఁగడచి శాశ్వతానందమున్ గొనిరి. వారల పవిత్ర చరిత్రము నీకిందచక్కగ వక్కాణించెద.

కథా ప్రారంభము.

తే. పరమపవిత్రుండగు గౌతమతాపస వరుచేతనుముందు
ధరకరుదెంచిన పావనియగు గోదావరితీరమునందు,

వ. తత్తీరంబునం దొకపురంబు గలదెట్టిదనిన,

సీ. ఏతట్టు జూచిన ధాతతోసమమైన ప్రతిభగలిగిన పండితచయంబు
ఏవంకజూచిన దేవగురునిమించు ప్రవిమలంబైన సత్కవిజనంబు

ఎచ్చటజూచిన నిసజుకొనస్తాన్యాగముసేయు మానవసమూదయంబు
ఏదిశజూచిన నెలమితోఁబతులకు రాగంబునొసగెడు స్త్రీగణంబు

గీ. సకలవిద్యార్థులకును సౌఖ్యప్రదంబు
ఆంధ్రగీర్వాణభాషల కాస్పదంబు
బరగ రాజనరేంద్రుని బట్టణంబు
త్రిదివ సుఖదంబు రాజమండ్రిపురంబు.

తో. ఆనగరంబున మృత్యుంజయుఁడను నవనీసురవర్యుండు
మానుగశంభుని పాదపూజనము మరువక వసియించు
కామాక్షియనెడు కన్యను పెద్దలుప్రేమను బెండిలిసేయన్
సోమశేఖరుని సత్కృపచేతను సుతత్రియంబునుగనియెన్.

వ. ఇవ్విధంబున కాలంబుగడపి కొంతకాలంబు చనినపిదప.

శా. చాలంగాలము భూసురోత్తముఁడు సంసారంబునంగల్గు సౌ
ఖ్యాళిఁబొంది విరాగుడై సుతులకా యర్థంబుసర్పించి శ్రీ
కైలాసాధిపు దర్శనంబుకొరకై కాశీపురంబేగు చో
బాళిన్భానుసుభార్య నాథుగని తాబల్కెన్మదిందీసమై.

హరికాంభోజి ఆదితాళము.

చను దెంచుట న్యాయమా యిది కాయమా॥చను॥

౧ తనయుల బంధువుల। ధనముల ధాన్యముల। మనములోపల నునోసి వారణాసికి ॥చను॥

౩ యురవునుండి భక్తిఁబరగఁజేసినముక్తి। దొరకునని యందురు। పెద్దలందరు ॥చను॥

౪ కనుకనిటులఁజేయు। ఘనసుగుణరాయ। చనదిక నన్నుఁబాయు। సద్భాగధేయ ॥చను॥

కా. ఈలా। గుణనుతశీలా। ఘనబుధజాలా। సుగుణశీలా। యశోనుగాంతి
లా। శ్రీతఁ బేల ॥నేను॥

శమ్మ. చూడు। బాలాజీనే లేవాడు। భుజగభూషణుడు। బూచుల రే
డు। జితమారుడు। వానిఁ బాడు ॥చీతా॥

వ. ఇట్లు మృత్యుంజయుండు పలుకగ కామాక్షి భర్తం గని,

తో. కోరికలందిఱెడు ప్రియుఁ బాసిన కోమలికి హాగాదుల్
భారము కీరము వైరము వసంభాసిత వేణుసూనుల్

వ. మరియు,

తో. నినుఁ బాసినదారి నబ్బిన సౌఖ్యనికాయము విషతుల్యంబు
నినుఁ గలసినదారి నబ్బిన విచారచయం బమృతసమంబు.

గీ. ఈ తెలుంగునఁ దెలుప విధాత్రవంశ
జాతుఁ డాశ్చర్యమును బొంది సమ్మతింప
నష్టమానగర్వంబుతో నశివమని
తోడఁ జనునెడఁ గాశికి వేడ్క కలర.

వ. ఇట్లు శారదకినడుమ బోవుచుండ,

పంచచామరము.

ఘనాటవిస్వధూటి చాలఁ గష్టమొంది డింభకు
స్తనంగివాని రూపుఁ దండ్రి కాంచి భార్యతో ననెన్
వనంబులోనఁ జింతమాని మాఱికుక్రింద నుంచిర
మ్మనంగ వారిజాస్య విస్మయంబుతోడ నిట్లనెన్.

వ. నాథా ఈపసిబిడ్డ నరణ్యమధ్యంబున విడచుటకు నామనంబెట్లు సమ్మతించునని కామాక్షి గణితశాస్త్రంబు జూచితి నీబిడ్డవలన మాయొద్దనున్న మనకు ప్రాణహాని కలుగకమానదు గాన నామాట వినుమన వనితారత్నంబు బాపసిబాలుని విలోకించి,

ఘూర్జరి-త్రిపుట.

నిను బాసి యెటులనుందు॥ నిను॥

౨. తనవుజితమార నా కుమార॥ నిను॥

౩. సరసిజసంభవుండు। జాంబూనది పంకమును॥ తరణిని సానబట్టిన।
వరచూర్ణముగలిపి। పరగనమృతంబున। పదునిడి చేసెంగాకున్ననీ।
తరువులితర తనుకాంతిచే। సురుచిరముగనుండె। గరిమను బాలాజి
నేలి। హరు దయచేంగలిగి దొడ్డబిడ్డడ॥ నిను॥

వ. ఇట్లుచింతించెడు భార్యంగని మానవతి విచారింపవలదు. పు
సురున్న నుప్పముక్కొని బ్రతుకవచ్చునట్లు ప్రాణమున్న సుఖం
బాదవుగాన శోకనొందక పుడువుమన నాపాలదిపత్తిచెట్టుక్రింద
బిడ్డనుంచ నామ్యాత్యంజయుండు.

శ్లో॥ యోమేగర్భగతస్యాపి। వృత్తింకల్పితవాన్ ప్రభుః

వ. అనునీయర్ధశ్లోకంబును తాళపత్రంబున వ్రాసి కుమారుని
శిరోభాగంబున నిడి చనియెనంత సర్పము చిన్నవాని కెండతగులు
నప్పుడు పడగనొడ్డుచు చుట్టియుండ మఱికొంతసేపటికి తేనెబిందువు
లిడిపెరిబాలునివదనగహ్వరమునం బడుచున్నంత వధూవరులు కాశీ
నగరంబును సమీపించి గంగానదిం గాంచి భార్యతో నిట్లనియె.

హిందుస్తానీ భయిరవి-త్ర్యశ్రలఘువు.

అదిగో చూడుచాన। హరిపాదజనుబిరాన॥ అది॥

౨. పదునాల్గిటిలోనం బున్యానది సురుచిరజగాన॥ అది॥

౩. తతవిమలతరంగా। సం। గతసలిలవిహంగా।
కృతదివిపదిమ్యాంగా। ము। గ్రహహోపాంతరంగా గంగా॥ అది॥

౪. శరధికూరత్రాణీ। కలి। తరతిపరిపుసేణీ
వరసైకతశ్రోణీ। బాలాజీ। సురితహారిణీవేణీ॥ అది॥

వ. ఇట్లు పవికించని

చ. ఘనవిపినంబులో మృగనికాయములం గనుమాడి తృష్ణచేఁ
జనిచని కాంచెఁ బద్మయుత చారు సరో వరమందు జీవనం
బును గూడ నుండి చెంతవటభూజము క్రింద ఫణీంద్రవేష్టితై
తనరగనున్న రూపజితదర్పకు విప్రకుమారు నంగనేన్.

వ. చూచి వానిరూపవిభ్రమంబునకు సంతసించి

శంకరాభరణం — త్రిపుట.

౧. బ్రహ్మాదులకు వశమా। కొనియాడగ ॥బ్ర॥

౨. జిహ్వాగ్రము చేతఁ జుట్టియున్న। చిరుతరూపముఁ గొనియాడగ ॥బ్ర॥

౩. వ ; లతలీతని, తనుకాంతిని, వరరుచిని బొందెనీతని ॥బ్ర॥

౪. వాల, యమునగబాలా, జిని వలీల, నేలినకృత్తిక పాలగోపాల ॥బ్ర

వ. ఇట్లు కొనియాడి.

చ. మనుజవిభుండు బాలకుని మక్కువతోఁ గొనిపోయి సత్రిమా
వనమునఁ గట్టి శ్లోకమును వ్రాసి భటాళిని నిల్పి శ్లోక పూ
ర్తిం జేసి నెవరేని చేసినను తీరుగఁ దోకొని రమ్మనంగ నా
వనజభవాన్వయుండటకు వచ్చి గనుంగొని విస్మయంబునన్.

తే. ఆసత్రంబున భుజించి యచ్చటనర్థ శ్లోకము న్నటులు
భూసురోత్తముండు వినితక్కినది పూర్తిగ వ్రాసిన భటులు.

శ్లో. శేషవృత్తి విధానాయ సుప్తః కింను మృతో ధవా.

వ. ఇటుల వ్రాసిన భటులా మృత్యుంజయుని ప్రభావసు నెదుట నిలుప
నాన్నృపతి కారణమేమన మృత్యుంజయుఁ డాతనింగని

బేహాగ్ — ఆది.

౧. మా భూపతినా। మనసిడి దయనువిన. మా॥మా॥

౨. మానేరము లేనియున్న। మన్నించి రక్షించుమనా॥మా॥

౩. కాంతాసమేతుఁడనై। కాశికేఁ బోవుచుండ। కాంతారమున సుతుని
గన్నది యీచిన్నది॥మా॥

౪. తనయుని మఱ్ఱిమ్రానుదరినుంచి ముదముతోఁ జని। జయుండనిమి
శ్లోకమున। చ్చట వ్రాసి వారణాసి ॥మా॥

౫. బాలాజీనేలినట్టి। బాలచంద్రమౌళిన్। వాలాయముగఁ జూచివచ్చి
నిను మెచ్చితి॥మా॥

మ. అనియీరీతిగఁ దెల్ప రాజు యత్యానందమగ్నుండునై
గనియా కాంచన గర్భవంశజుని హృత్పంకజంబునుప్పొంగగాఁ
దనయుండోడ్రాని పౌత్త్రునంగ నతఁడా ధాత్రీశుసింగాంగ యో
జననాథాగ్రిణినాకు బల్వురుసుతుల్ జన్మించిరీ ధాత్రిలోన్.

తో. దేవునికృపచే సిరిసంపదలు దిక్కైన గ సకలు లవు
భూవర సాల్గవడితడు యీపుత్రునిఁ గొనుడిక సెలవు.

౭. దయచేయుండని వేడిన నరపతి ధరణీసురునకుచాల
నయమున ధనమొసఁగి చేకొనిచనె నగరంబున కావేళ

వ. ఇట్లు బ్రాహ్మణదంపతులు ప్రభాసునకుపుత్రునొసఁగి వారివలన సత్కారంబుగొని చనిన నా నృపుండు బాలకునిఁ బుత్రునిగా నెంచి వరరుచి యనునామంబిడి పెంచుచు కొంత కాలంబు జరిపిన వెనుక,

పంచచామరము.

ప్రభావసుండు వాంఛజాల భక్తిఁ గొండఁబెంచియా
నభాళిమెచ్చ రాజ్యమిచ్చి సంతసంబునం జనెన్
శుభంబుగా దపంబుఁజేయ సుందరాంగి వెంటరా
సభంబునందు దేవతల్ ఘనంబుగ న్నుతింపగన్.

వ. ఇట్లు రాజ్యంబొసంగి ప్రభావసుండు చనిన వరరుచి రాజ్యంబుఁ జేయుచు,

సావేరి—ఆదితాళము.

౧. ఆడిన మాటఁ దప్పఁడు। అతిథుల మరల రమ్మని త్రిప్పఁడు॥

౨. చూడఁదగినవాఁడు, కంధర మొప్పచుట్టు, వాలుజోడు నుగ్రఖడ్గరుచికి, చుక్కలకొరయోఁడు, త్రిశంకుని సుతునకునీడు, సుమంతులంగూడు వరరుచి శీలరేఁడు॥ ఆడి॥

౩. బాలాజిని మెండు, గా నేలిన ఫాలాక్షుని రెండు, పాదములు భక్తిఁ గొల్చుచుండు, దీనులను బాలించుచుండు, పాఠ జదువులు విండు, పారాయణంబు జేయుచుండు॥ నాడి॥

సీ. స్మరవైరిభక్తుండు వరగుణయుక్తుండు నాశ్రితపద్మజనావనుండు
కరుణాసముద్రుండు కమనీయభద్రుండు ఘనదానరసితవసుధరుండు
పరమపవిత్రుండు సురుచిరగాత్రుండు విపురాజపవనదర్పకరుండు
సత్యస్వభావుండు సమరప్రభావుండు సంస్తుతాంధ్రకవాళి...



గీ. అతులసౌందర్యవిజిత పుష్పాయుధుండు
పాపసంచయ తిమిర ప్రభాకరుండు
సకలభోగ సమీక్షిత శచీవిభుండు
బ్రహ్మకులజుండు వరరుచి పార్థివుండు.

వ. ఇట్టి గుణంబులచేత నలరి ధర్మంబుగ రాజ్యంబేలుచు సభ్యులనాలోకించి,

ఉ. నా మెదఁ బుట్టినట్టి కడునాడెము గల్గిన సందియంబు నేఁ
తోయజగంధి తీర్పఁగలదో కని దానిఁ బరిగ్రహించెదర్
ధీయుతులార నేఁదిగువఁ దీరుగ వ్రాసిన ప్రశ్నఁ జూడఁడీ
నీయభిమాన మెవ్వరిది సిక్కముగా లిఖియించుకోమలీ.

ఉ. ఈయది తాళపత్రమున నింపుగ వ్రాసి భటాళి నంపుడీ
శ్రీయవనాంధ్ర చోళఘనసింధు పుళింద మరాట లాట భూ

నాయక సత్సభ స్థలుల నాడెముతోఁ బ్రకటించునట్లుగాఁ
జేయవలె న్మంత్రి కులశేఖరులార వివేకులారనన్.

వ. ఇవ్విధంబున వ్రాసి సకలదేశంబులకుఁ బంపఁ గొందరు రాచకన్య కలు నాయభిమానంబు భర్తద న్నీ ఉత్తమాంమలదని కొందఱు తల్లిదండ్రులని కొందఱు వ్రియుడున్న సింతట.

తే. చోళపురాధీశుని పుత్రి గుణశీల ప్రియంవద చూచెన్
చాలదూరముగ యోచించి తగిన జాబును దాఁకి వ్రాసెన్.

క. మాయలుగావు సుమా భూ
నాయక సందేహములనయముగఁ గను కా
త్యాయని సాక్షిగ వ్రాసితి
నాయభిమానంబు నాది నయగుణదీపా.

ఇవ్విధంబున జవాబు వ్రాసి చూడిగువ మీం ప్రశ్నంబునకుత్తరము నాఁకుదోచినరీతి వ్రాసితిఁగాని నా వ్రాత మీాయభిమతంబునకు సరిపడినఁ గదా నన్నుఁబరిగ్రహింపఁ దలంపుకలుగును నేనిదివరకొక సమస్యఁ బ్రచురించియుంటిని దాని నెవ్వరు పూర్తిఁజేసి పడిచెదరో వారిసిం బెండ్లియాడెదనదియెద్ది యనఁ.

సమస్య.

ఉ. నీవ్రతమాచరించెదను నీటుగ నన్నుఁబరిగ్రహింపుమా.

వ. అనియిట్లు వ్రాసి యీాదిగువ.

ఉ. వ్రాలివిగో గనుంగొనుఁడు వన్నెయు మీారఁగ వ్రాసియుంటినా
వ్రాలు సుధారసాలు కవిరాజులకెల్ల మనోహరాలు వ
జ్రాలు సరస్వతీ విమలచారు కుచాగ్రసరాలడాలు నా
వ్రాలుఁగనంగ మోహనకరాలు నుతింపఁ దరంబెమీారికిన్.

వ. ఇట్లు వ్రాసిపంపిన నాపరరుచికని సంతసించి ప్రియంవదవ్రాసిన ప్రశ్నంబు కుత్తరువు నొసంగ నియ్యకొనె.

ఉ. తీవ్రమతి న్వధూటి విను ధీరులు మెచ్చఁగఁ గాంచఁ బ్రసూ
న వ్రజముల్గ్రహించి భవనాశకుఁడైన మహేశు పాద యు
గ్మవ్రతనిష్ఠఁ గొల్చుచును గట్టిగ వ్రాసితి నట్టి శైశవ
త్క్షవ్రతమాచరించెదను నీటుగ నన్నుఁ బరిగ్రహింపుమా.

వ. అని వ్రాసి యీదిగువ.

ఉ. వ్రాఁతగఁ గొంగఁజాలు కవిపాలురు నూటపదారువేలు మూ
డ్రాలు యశస్కరాలు సురరాజమణిప్రకరాలు చంద్రహా
రాలు మనోహరాలు సురరాలు సుధాకరాలు పుష్ప హా
రాలు ప్రవాళమౌక్తికసరాలు వరాలు వరాలనందఁగన్.

వ. ఇవ్విధంబున వరరుచి వ్రాసిపంపిన ప్రియంవద చదివినాకుండగిన
వసుఁడీతండని తఁడ్రికెరిఁగించిన నతండు వల్లెయని యూరకుం
డిన నంత నీప్రియంవద.

చ. వరరుచి వ్రాసిపంపిన జవాబుఁ గనుంగొని మోదమొందుచున్
తరుణి కరాటమందున హృదబ్జమునుంచి క్రమంబుగాఁ బయిన్
హరుని సమీరనందనుని హాటకపుష్పము నొక్కసర్పము
న్గరిత లిఖించి పంపెఁ దనకాంతుని మ్రోలకు దూతికన్వెసన్.

వ. అంత దూతిక యిచ్చిన కరాటంబుఁ జూచి ప్రియంవద చతురతకు
మిగుల సంతసంబంది చోళదేశాధీశపుత్రికయగు ప్రియంవదను
వివాహమాడ నిశ్చయించి యామెయొక్క జనకునితో మాట్లా
డుటకై ప్రయాణసన్నాహము జేయుచు వేరొక పటపత్రంబున.

సప్తమితో షష్ఠివని చాలగనమ్మితి నోతలోదరీ.

వ. అని వ్రాసి ప్రియంవదకిమ్మని దూతిక చేతికివ్వ దానిని దూతిక
వీక్షించి వరరుచినిగాంచి.

ఉ. పాపవశంబునన్నడుమ పంచమమై నవలీలభార్యయుగం
బాప్తినిజెంది ద్వాదశము నక్షియుగంబు బహురంగనొప్పి సం

తృప్తిగఁదాత్మఁబ్రియను వరించి దశధ్వజు బాదిగొన్న యా
సప్తమి లేక పష్ఠియనఁజాలును సందియమేల భూవరా.

శా. సింహము ధనస్సు మీనము మిథునము మకరము తుల కన్య.

వ. ఇటుల నాదూతిక చెప్ప దూతికయే యింత వివేకవతిగా మాట లాడె, నాప్రియంవద యెంత ప్రౌఢయైయుండునని విస్మయంబంది చోళపురాధీశుని దర్శించి పుత్రిక నిచ్చి వివాహంబు జేయుండన నంత శుభదినంబున నాప్రియంవదనిచ్చి వరరుచికి వివాహంబుఁ జేయగా కొన్నిదినంబు లచ్చటనుండి నిజనివాసంబున కరుదేర.

చ. వరరుచి భార్యతోడ ఘటపద్మముతోడనునావ నెక్కి స
త్వరగతి గంగమధ్యమునది వ్రక్కలుగాగనె యావధూవరుల్
చెరియొక తిప్పఁజేరిరి విశేషవిచారమున లో మునింగియా
యిరువురునుండ భూమిసురుఁ డివ్విధము న్విలపించె నప్పుడున్.

చ. దురితపు దైవమెంత నిను దూరముఁ జేసెను చూడలేక బం
భరనిభవేణి నీరరుహపాణి సుకోకిలవాణి మోడలో
నరమరలేక ముచ్చటల నాడుచునుంటిమి జాము క్రింద నీ
సరి నను బాసి నే నెటులఁదాళుదు నోగజగామినీమణీ.

వ. అయిట్లు చింతించుచు వనంబునఁ బ్రవేశింప నంత నీశ్వరుం డీతని మనస్సు శోధింపనటకై దివ్యాప్సరసవలె వచ్చుచున్నంత.

చంపక మాలిక.

వరరుచి తృష్ణచేఁజనుచు వారిజగంధినిఁజూచి చేరి యా
తరుణిఁడు మానినీ యమృతధామముఁ జూపుమటన్నఁ బల్కెనా
దరమునఁ గూర్మయుగ్మమును స్థాయిగ నక్రయుగంబునుండు నా
శరచరయుగ్మమందరటి స్తంభములుండును వాటిపైనను
ద్ధరయును సింహదంబరవితానము నందొక బావిదాట భా

సురమగు మెట్లపోంత బలసూదనరత్నపథంబు చెంత భూ
ధరయుగముండు నాగరులదాటిన శంఖము దృశ్యమా సుధా
కరుఁడల శంఖపీఠమున గాలికతో విలసిల్లుచుండు సుం
దరశశివేడఁగా నమృతదానముఁజేయును వేగఁబొమ్ము నిం
దారలిఁ దప్పితిరునఁ దొయ్యలిభావము నాపి్రియంవదా
వరుఁడు గ్రహించి సారతర వాక్యముదాయముతోడ నిట్లనెన్.

తా. పాదములు, జంఘులు, ఊరుద్వయములు, కటి, నడుము, నాభి, వళులు నూగారు, స్తనములు, కంఠము, ముఖము, ముంగురులు, అధరము.

హిందూస్తాని భైరవి—ఆదితాళము.

౧. ఏమో మగువ। నీకింత తెగువ॥యే॥

౨. భామామణియిట్టి। భావమునుగట్టినే మనుసుబట్టి లిచిన సంతుష్టి॥

౩. తొంగలరాయని। దగిలిన గురుజాని। ధరనిభూమిని నరిగిమానని॥

౪. తనవరుఁడె దైవ। మని నమ్మి భావ। మనజేయు సేవ। మోక్షమునకుఁ
దోవ॥యే॥

౫. దాసబాలాజిని। హాసిగనన్నుఁ జేసిన శంభుని। జింతించు పూబోణి॥

౬. కావునఁ బరసౌఖ్యదమిది। నీ వాడిన నుడువు లిపుడు నీతివిరుద్ధం।
బై వెలయునఁ గనాతపతివ్రతామణి నుబలెన్ఁదొరపు బ్రీతిన్॥

సీ. యోజనగంధి సంయోగంబుఁ జేసిన వ్యాసమునిని వెలి వేసినారె
పరమదోషమగు గురుభార్యఁగూడిన సారసారిని గేలిసల్పినారె
కన్న పుత్రికఁ బొందుఁ గావించినట్టి యా కాంచనోదరుని దూషిం
చినారె.
గౌతమపత్నితోఁ గలసిన సురపతిన్ జేజేలు ముదలుఁ జేసినారె
యెందరో యన్యభామలఁ బొందలేదె
గాన నటువంటివారికి లేదె తప్పు

నీకుఁ గలదని యెంచుట నీతిగాదు
బూటకంపుమాట లేల యీపాటి వేచి॥

కమాచి - రూపకము.

౧. రారసామీ యింతచలమేల చేసేవేమి॥ రార॥
౨. క్రూరమరుబారిని వేసారితి నిన్నుఁగోరితి వేగ ॥రార॥
మనవి వినవేర సామి ॥రార॥
౩ చక్కని ముత్యాలకుచయుగ్మనరాసి [illegible] వక్కలి [illegible] హన్ను
పయిని జేరి। యక్కునఁ జేర్చి బ్రజాణ। యోడుక్కొనెదవిరాన ॥రార॥
వ. ఇట్లు పలుక.

ఉత్పలామాలిక.

పీలూ - త్రిశ్రలఘువు

ఉ. సారసపత్త్రనేత్ర యిటుచక్కఁగఁ బల్కఁగ జూచి యోసఖ
నారుమహానుభావులలహారలకున్మనకున్న మత్వమా
యీ నమిఁకిటన్ హువు మేకవధూవ్రతుఁడన్నమీదురా
చారుఁడఁగానునమ్ముసర॥
దార ధనాదులనుగోరి నేను శివపదసేకజయుగమ్మంబునుఁ
గడుజాను, మీరగ, మదమారఁగఁ గొసియాడెదనోబోటి। మారరు
నిఘోటి। చనుమీపాటి। బోటి॥దార॥
వ ఇటువరరుచిపలుక హారుంము సంతసించినిజరూపంబునుగనుపరచి
ఉ. కుందగనేల నీసుమతి కొద్దిదినంబులలోనవచ్చుదా
నిందులకబ్ధిదాటెను మహేశకృపన్సతి కాననుండెనీ
[illegible]రతెల్లఁ నీరు [illegible] రంపుమిత్త్రిను దెల్పియప్పుడే
యిందుధరుండుపోయె పృథివీశుఁడు డెదమానంద గుందుచున్॥
వ. ఇట్లీశ్వరుండు తెల్పిచనిన [illegible]నభార్య నజీవురాలుగా నున్నందుకు
సంతసించి చింతలేమికి విచారించుచు వెనుకదోడంగె.

సీ. కపులార మాతంగరిపులార మత్తమయూరపులార కంటిరే తరుణి జట
పులార శిఖిపికావళులార చంచుతోయ్యాలులార కంటిరే యబ్జగళను
యతులార భల్లూకతతులార ద్రుసంతతులార కంటిరే న్విపినచట
హారులార చందనతరులార మదమధుకరులార గంటిరే కరిగమనను.



గీ. బకములార మరాళశాబకములార
శుకములార సురక్తికింశుకములార
రంభలార లావణ్యకారంభలార
ముదముతో గంటిరే ప్రియంవదనచట.

వ. ఇట్లు వరరుచి చింతించుచు నతని వెదకుచుండె ప్రియంవద వేరొక
విపినంబున నిట్లు చింతించుచుండె.

కమాచి—రూపకము.

౧. ఏమిసేతు నెటులనైతు సోమశేఖరా ధృతదర్వీకర॥ ఏమి॥
౨. పూర్వమున నే పూజజేసి। శర్వరీశముఖుని బాసి। యుర్వి విపద
బ్ధిని మునిగి యుంటినిగా నొంటరిగా॥ ఏమి॥
౩. దిక్కెవ్వరు నాకునింక। దీనురాలనైతి వంక। చక్కగ గాంచుదును
నిశ్శంక। స్థలమున నెచట దలంపనిచట॥ ఏమి॥
౪. నామొరాలకించవేల। నగజాహృదయాబ్జలోల సామజచర్మను
కూల కామభంజన బాలాజీరంజన॥ ఏమి॥

వ. ఇట్లు వనంబున ప్రియంవద చింతింప కుసుమధన్వుండను నృపుం
డు వేటకై వనంబున కేతెంచి ప్రియంవద నాలోకించి.

ఉ. ఎవ్వరిదానవీవు కులమెయ్యది నీతలిదండ్రు లెవ్వరో
జవ్వని ఘోరవన్య మృగసంఘునినాదము లుప్పతిల్ల నీ
వివ్వకంటకస్థలుల నెట్లుల నొంటిజరించుచుందు నీ
కిన్విధి యేలకల్గె నిక నిందు భాష్య మెరుంగ దెల్పుమా.

వ. అన నాతని ప్రియంవద గాంచి.

వ. అవనీశుం డీవిధమున బల్క ప్రియంవద దిగులునుబొంది ప్రస్తుత మేదియో బొంకి మానము గాచికొనుట యుక్తమని,

సీ. భూప నా వయినింత కోపంబడియు నేల
యువతులు సమ్మోహమున్నయట్టుల
నటియింతురా నృపనందన గలదొక్క
వ్రతము దానిదీర్చి పరపురుషులఁ
బొందెదఁ గావున స్ఫుటముగా దాని
నెరవేర్చినట్టులైన నిన్నుఁ గలతు
నది యెద్దియనినఁ బుణ్యస్త్రీలకు పసిండి
చేటలు నొక వేయి నీటుగాను

గీ. పంచిపెట్టెదఁ గాన నీవగిది మీరు
యత్నమును జేసి నెరవేర్చి యబ్జబాణ
సంగరముఁ జేయుఁడన నృపపుంగవుండు
కడుముదంబున నిది యెంతకార్య మనుచు.

వ. కుసుమధన్వుండు ధనాగారంబునంగల ద్రవ్యంబెల్లఁ గొల్లబెట్టి చామినర్థరాజ్యంబమ్మి వెయ్యివసుశూర్పలక్షంబులు చేయించి దక్షిణాక లక్ష రూక లొసంగి, తాను శృంగారించుకొని సౌధాగ్రింబుననిలిచి చూచుచున్నంత నాప్రియంవద క్రిందనిలువఁబడి,

హిందూస్థాని కాఫీ—త్రిశ్రలఘువు.

౧. ఆచరించెదను ప్రియంవద॥ వ్రతమా॥
కడుముద, మునబుధ, జనులెదఁ, బొగడఁగఁ గీర్తినెగడఁగ॥వ్రత॥

౨. ధీర చతురతతోడ। నలద్విజులు గుమిగూడ। నలరోచానలుపాడ। పురజనములు కొనియాడ। యా, రామాలిమేడ। పైనుండి బడాయిగను జూడ॥ నాచ॥

౩. జనులార నాపేరు జెప్పఁ గానిబ్రీతుఁ గండి। హూ। వనజసూతి నాకేటు
వ్రాసెనో సుమండి తరఁగ బీబాలాజిదాసుని దండి, గానేలిన
ఘనుచండి॥ కాపత్రికిఁ బ్రీతిఁ జేయుచుండి॥ యనుచ॥

వ. ఇవ్విధంబునఁ జేటలన్నియుఁ బుణ్యస్త్రీల కొసంగి చనిన కుసుమ
ధన్వుండానెనఁ గని మారు వారికిఁ గోరిన నామె యిట్లనియె.

చ. కరుణ యొకింత లేక ననుఁ గంతుని పోరికిఁ గోర బాసియే
వరవ్రతమాచరించి యుపవాసముతోడను నుంటి నానిశా
కరు డుదయించు వేళఁ గని కాముని కేళికి రమ్మనంగ నా
ధరణిశిఖుండు వైశమున ధామముఁ జేరెను నంతసంబునన్.

వ. పిమ్మట ప్రియంవద తనదుర్గతికి చింతించుచు నీశ్వరునిఁ గూర్చి

జంజూటి-ఆది.

౧. ఎవరున్నారు ననుబ్రోచేవా॥ రెవ॥
౨. అవనిలోనిన్నువినా। మాకుఁ జాశరణ్యులిం॥ రెవ॥
౩. యీరాజేంద్రుఁడు మదిఁ గోరక కక్యాకా। వ్రతినిఁ జోరనున్నాడే రా।
కాచుటకును సమయమిదే రా। ననుఁగావఁ యున్నను ధీరా॥ తన్మ
లు కరిగిండవు। గద యనినుదువు। దరుగద తడవు యేరా। రా
వేలా। బాలాజీదాసాధినిఁగాస। గౌరీశా॥ యెవ॥

వ. ఇట్లు ప్రార్థింప నట్టి సమయంబున,

ఉ. చంద్రురుఁ బాండరక్తయుత శాలసి నూటిగ విప్పి యామినీ
సుందరి కుందకోశగణ శోభితసింధ కూల ధారియై
పొందుగనున్న చందమున పూర్ణవికాసముగల్గి తారకా
బృందముతోడ చీకటులు బెంపుగ నున్నవి నేత్ర పర్వమై.

వ. అంత నీశ్వరానుగ్రహంబున బిగముఁ బిగించియున్న గవాక్షకవా
టంబులు పెటపెట పగిలిన నామేడలో తూగుటుయ్యాలనున్న

గొలుసు లాకిటికీ చెంతనున్న బాదముచెట్టు కొమ్మకుఁ గట్టి తద్వా
రా దిగిచనె నంత కుసుమధన్వుండు విరహతాపంబునం బొక్కు
చు నిశాకరుండు రామి నిటుల నిందింపం దొడంగె.

కీరవాణి—ఆటతాళము.

౧. ఏమిటికింకా రావో సోమా। యెందుదాగితివి సుధాధామా॥యే॥
౨. పవనాశనుడు నిన్ను బట్టెనా। లేక। శివుడు రథమునందు గట్టెనా॥యే॥
౩. గురుభార్యకాఁగిటనుంచెనా। లేక।సురగణము కళలారగించెనా॥యే॥
౪. బాలాజీదాసప్రపోషణ కలశపయోధిగర్భ సద్భూషణ॥ యేమి॥
ఉ. పట్టుగ నీగవాక్ష సుకవాటము లెట్టులఁ దీసినావు బ
లట్టిగఁ గట్టినట్టి వసుఖట్వను నం దలరారు గొల్సు లీ
చెట్టున కిట్టుఁ గట్టితివి శీఘ్రముగా దిగి మోహనాంగి యే
తట్టునఁ బోయినా వికను తాళఁగ లేను సుమా తలోదరీ॥

ఆనందభయిరవి-రూపకము.

౧. మోసముఁ జేసినావుగదా। యో ప్రియంవదా॥ మో॥
౨. భాసురాంగి నీసుందరంబు। వాసిగఁ గనుఁగొని మోహంబు। చే
సుమసాయకునాలంబుఁ జేతునసఁగ నీదినంబు॥ మో॥
౩. సర్పవేణినాదు వ్రతము। సఫలమైననారతము। దర్పక కేళిలో మన
ముఁ దనియింపుదుమని నీదినము। కర్పూరగంధీ ధననికాయమెల్లఁ
బుణ్యసతులు। కర్పణఁ గావించి యెటకు నరిగితివో।తిరిగితివో।దర్ప
ణముఖి బాలాజీ దాసుని సంతసించిన। సర్వభూషణుండె మనకు
సాక్షి। మీనాక్షి॥ మో॥

వ. ఇట్లు చింతించి యాకుసుమధన్వుం డామె వెతుక నారంభించె నిమ్మ
ట ప్రియంవద నంతసింపుము బోవుచున్నంత ముగ్గురు దొంగ
లామెంగని సమీపించి వారిలో వారిట్లనుకొనఁదొడఁగిరి. అం
దొకడు నం కంటికీమె సరస్సువలెం గనుపించుచున్న దట్లనిన.

మ. వరకాదంబ మృణాళనీరరుహశైవాలాబ్జకోశాళి శ్రీ
కరపాళీ కదంబకచ్ఛపదరగ్రాహంబులన్బోలు భా
సుర సంచారభుజాస్య కేశభరవక్షోజద్వయాక్షిద్వయం
బురుపాదోపరిభాగ కంఠగురుజంఘోద్గాఢముల్గాడనీ
తరుణిం జూడసరోవరంబనదగున్దథ్యంబు గొంకేటికిన్.

వ. మరియొకండు కంటికివనంబువలెం గన్పించుచున్నదదెట్లనిన.

క. కరిగిరిహరి మధుకర శ్రీ
కరమృగములఁబోలు దాని గమనస్తనభా
సురమధ్య చికురనేత్రము
లరయఁగసద్వనముదీని ననదగునుజుమీ.

వ. ఇంకొకండు బ్రపంచమువలెం గన్పించుచున్నదదెట్టులనిన.

క. కటిధరపటము జలము వి
స్ఫుటతనురుచి తేజమతివ ముఖగంధము ప్రా
కటపవనమంబరము కౌ
నిట దానిఁ బ్రపంచ మనఁగ నెన్నగవచ్చున్.

వ. ఇట్లు వారిలో వారనుకొనుచు యిచ్చటకు వచ్చుటకు కారణం
బేమియని ప్రియంవద యిట్లనియె.

గీ. భర్తతోడను నావపై వచ్చుచుండ
నోడపలిగిన నీది యీ జాడవచ్చి
యున్నదానను గాన నోయన్నలార
యింక విధియెట్టులున్నదో యెరుఁగలేను.

వ. ఇట్లన వారలామెంగని నిన్ను బోషింతుముగావున.

ఖరహరప్రియ-ఆదితాళము.

ఘాన, యేలనే బిరాన॥ యోచాన॥

౨. మీనాక్షి లెమ్ము । సూనాస్త్రుడమ్ము । లయురమ్ము । సందుచాలం జమ్ము । చుండె॥ చానా॥

౩. చోరులము మేము, కోరిన భూషణము లనయము। నీకునిచ్చెదము యో॥ చానా॥

౪ బాలాజిని చేపట్టి। పాలించునట్టి। ధూర్జటి। పదమాన బోటి॥ యో॥

వ. ఇట్లు దొంగలనగా ప్రియంవద చింతించి వీరల నేదియో యొక యుపాయంబున మోసంబుఁజేసి తప్పించుకొనుట యుక్తంబని సమయోచిత సంభాషణలచేతం దృప్తులఁ గావించి.

ఉ. ఆకలిచేత మిక్కిలి ప్రయాసముఁ బొందితిగావ నన్నము
నీకను దెచ్చిరేని కడు వేడుకతో భుజియించి సమ్మటన్
సైకముగాను మీహృదయ సారసము న్దనియింపఁ జేతు నే
డాకులవాటు నొందక ప్రియంబున నేగుఁడనంగ దస్కరుల్॥

తో. నీవు వెళ్లమని నీవువెళ్లమని నీచులు వాదముఁ జేయన్
యౌవనజేక్షణ సంతసమున మనుజాధములనుగని యంయెన్॥

గీ. అందరు చనుదెంచి యధికంబుగా నోగి
రమునుఁ దెచ్చి రేని విమలమతిని
మీరు నేను గూడ కూరిమితో దిన
వచ్చుననగ జరిరి ముచ్చులపుడు.

వ. అంత నా ప్రియంవద యచ్చోటు వాసి వేరొక చోటునకుం జని చింతించుచు నీశ్వరు నిట్లని స్తుతించె.

వరాళి-రూపకము,

౧. ఏమిసేతు నేమిచేయు దీశ్వరా మహేశ్వరా రారా॥ యే॥

౨. నామోహనాంగు డేమయ్యెనో। నే నేమినో। ను నోటితినో యెంతగతివచ్చెనో॥ యే॥

. వార నీసహాయ్యమునగిదా। నృప చోరబాధ। నరగ తోలగెఁ క
నామీద। నీదయరాదా॥ యే॥
౩౮. యిఁకమలఁబడియుంటిని చాలా। విధృతశూలా। పుడమిని యీ
యాడజన్మ మేలా బాలాజీపాలా॥
వ. ఇట్లు వితర్కించుచు దిగ్రించె నంత నన్నఁబుఁగొని తస్కరులు
వచ్చి యామె లేమింజేసి మిగుల కోపించి యిట్లనుకొనిరి.

పీల్వా-త్రిశ్రలఘువు.

౧. మోసముఁ జేసితివి రాజముఖి। నీబానతల్ల నెటకు నేగెనేసఖి।మ
మ॥ మో॥ కాసు, యీ, మాని, పినిఁ బట్టెదము, తలపై
మొట్టెదము। మమ్మ॥ మోస॥
౨. తుంటరీ మమ్ముఁదప్పించు కున్నావనుకుంటివా। యింతకోఁటివా।
వాల్గంటి నిన్నుఁ బట్టకయున్నయెడ మా। బంటుతనమేల బాలాజీ
నేలి నటు। వంటి, ముక్కంటియొ, సాక్షి మృగాక్షి॥మో।
వ. ఇట్లనుకొని యాదొంగ లామెను వెదకుటకై వెట్టివారి వలె దే
శంబులం దిరుగుచున్నంత.

సూర్యోదయ వర్ణనము.

ఉ. పూర్వదిశాంగనామణినిఁ బొందఁగఁ జీకటి దొంగలానతి
న్గర్వముతోడ బాధలిడఁ గాంచి తదీయవిలాసినీశ్రిమల్
సర్వమడంపరావె యని సారెకుకుక్కుటముల్ మాటాత్తిగా
నుర్విఁగూయుచుండ సుగుణోన్నతుఁడై యలతస్కరావళిన్
నిర్వృతిజేయఁ చ్చుగతి నింగినిదోఁచెను నీరజాప్తుడున్
వ. ఇట్టు సూర్యుఁడుదయించిన ప్రియంవద సంతసించి పురుష వేష
ముఁదాల్చి బ్రహ్మపురంబేలు భూపాలుంగని సమయోచిత
సంభాషణంబుల నాతనిమనంబుం గరుగంజేయ నాతని వివేకం

బునకచ్చెరువంది తన యధీనంబున దండనాయకోద్యోగం బా సంగ నాయుద్యోగంబున వర్తించుచు తనరూపంబునోలిన సాలభంజికచతుర్థంబు చిత్రకారునిచే నొనర్పజేసి తద్విగ్రహంబులనాలుగు రాజమార్గంబులం గట్టించి యీ బొమ్మలంగని యెవ్వరువిలపింతురో వారలఁదెండని దూతలనాతలంబుననియమించి నంతతస్కరు లరుదెంచి జంత్రముంగాంచి.

క. ఇటువంటి సుందరీమణి
చటుకున మముమోసపుచ్చి చనెననిపండ్లన్
పటపటఁగొఱుకుచు దరిచన
భటులాతస్కరులఁబట్టి ప్రభుకడకరుగన్

వ. అంత నాప్రియంవద తస్కరులను గారాగృహంబున నుండనియమించెఁ బిమ్మట కుసుమధన్వుండరుదెంచి ప్రతిమంగని.

క. అయ్యో యీరూపసుఁ గల
తొయ్యలి నను మోసపుచ్చి తొరపుధనమున్
నెయ్యముననఁ బుణ్యసతులకు
జయ్యన నర్పించెనని యచట విలపించెన్

వ. ఇట్లు చింతింప భటు లాతనిం దోడ్కొనిచని దండనాయకు ననుమతింగొని వానిం గారాగృహంబున నుంచిరి. పిదప వరరుచి యరుదెంచి ప్రతిమ నాలోకించి.

ఉ. ఎంతటిభాగ్యమబ్బె హరిణేక్షణకున్సమమైన జంత్రము
న్వింతగఁ గంటినంచు బృథివీపతి చింతిలవాని దద్భటు
ల్పంతముతోడఁబట్టి ప్రభుపాలికిఁ బోవఁగ నా మృగాక్షి య
త్యంత ముదమ్ముతోడ తనధామముకుఁ గొనిపోయి పిమ్మటన్

వ. తన భర్తయగు వరరుచిని తన సభాస్థానంబునకుం దోడ్కొని వచ్చి యుచితాసనంబునం గూర్చుండ నియోగించి కారాగృహంబున నున్న తస్కర కుసుమధన్వుల రావించి.

నానక్-ముఖారి-జుల్వ.

ప్రి. ఎందుకయా మీరలు నా।సుందరప్రతిమన్, గని యా।క్రందన
మానుమన్, సల్పినందుకు హేతువుం, దెల్పుడ। నందియు మొందక
నీజను। లాదరువినఁగన్, నాదు। డెందమునం దనియన్॥ ఎందు॥

వ. ఇట్లడుగ నాతస్కరుడు లాతనిం గని.

౨. త. ప్రతిమవంటి రూపము గల। యంతివ మమ్మలన్, బోనీక। తి
వేగముగన్, దెమ్మనఁ। గుతుకముతోడన్, జని యా। మెతుకులు
తేగన్, బిమ్మట। నతి యచ్చట జేమి దుఃఖసాగరమందున్,
మునింగి వెతఁజెందరాగన్, దుఃఖ మా। తతముగ రాగన్, గని
భట। తతిమాము బట్టెన్॥

వ. అంత కుసుమధన్వుం డాతనింగని.

౩. కు. రంగగుయీబొమ్మవంటి। యంగననున్ మన్మథసంగరమం
దున్ మదియుప్పొంగంగఁ జేతున్, గనుమని। బంగరు చేటలను వి
ప్రభామల కిచ్చెన్, సాధము। జెంగునఁ గడచెన్, మోనము।నం
గనచేయన్, మనసుక।లంగి యిచటకున్, రాగ। మంగళవిగ్ర
హము నిచట మానఁగఁజూడన్, దుఃఖిత। రంగిణితోపన్, గని
భటపుంగవు లెంతమిన్, బట్టి, మీ। ముంగలఁ దెచ్చెన్॥ రంగ॥

వ. ఇట్లు తస్కరకుసుమధన్వులు పలుక నాప్రియంవద పరలంగని,

ఆ-గీ. చోరులార మీకు నారు మానంబులు
శిక్ష జెప్పినాను క్షితితలేశ!

క్రూరవృత్తిలోన జేరుట తగదింక
నడువు సత్వరముగ నగరమునకు.

వ. ఇవ్విధంబున వారలకు బోధించి పిమ్మట నివాసంబున కరుగ్గి చి.
నాయకుచరణ సరసిజంబులకు వందనం బాచరించి నాథా! నేను
ప్రియంవదను. నేబడిన పాటులు నస్కారకుసుమ ధ్వజులవలన
మీకు విశదంబయ్యె. ఎవ్వరియభిమానమును వారు గాపాడు
కొనవలయు నను సంగతి నాడే నొక్కి వక్కాణించితిమి. మి
మ్మొక్కెడ బాసినది మొదలు నే నెటుల నటించితినో దైవం
బెఱుంగును గాన నాతప్పులు మన్నింపు డన నావరరుచి యిల్లాలి
చెయువులకు సంతసించి పిదపనిరువురు నిజనివాసంబున కేతెంచి
ప్రజా పాలనంబు లాలనంబుగం జేయుచుండ నంత,

చ. ఉసిరిక చెట్టుక్రింద నరులాయ్యన విందుల నెప్డు సేతురో
పొసగగ బాలికామణులు బూరెలపండగ నెప్డుసేతురో
వసుధను సాగరార్భకుని వారవ్రతంబుల నెప్డుసేతురో
కసిమసిగంగ జ్యోత్స్నగల కార్తికమాసము రాగ నత్తరిన్.

వ. ఢిల్లీపురాధీశుండగు అక్బరుపాదుషా సభం జేయనిశ్చయించి తన
కు కప్పంబులు సమర్పించు సామంతావనీ భర్తలకై వర్తమాన
ముం బంప నావరరుచి పాదుషా దర్శనంబుం జేయ సమకట్టి
వధూరత్నంబున కిత్తెరం గెరిగింప నంత మగనిముఖపద్మం బవ
లోకించి,

శ్రీరాగం—త్రిపుట తాళం.

౧. ప్రాణేశా మనసు నిన్నెడబాయదురా॥ ప్రా॥
౨. పాణిగృహీతినైనది మొదలో। జాణుండ యరనిమిసమైననా॥ప్రా॥
౩. సలలితముగను బాలాజినేలిన కలువలచెలినిం దలధరించిన। వాని
తోడు వినునేడు। నెలతలతోం దోటలను గూడి యాటల నాడి

పాటలను బాడి తపులగ గరమేటివిరులఁ గోయుచున్న వే! శల
నైనను గలనైనను జలమైనను॥ పా॥జే॥

వ. ఇట్లని ప్రియంవద,

క. కమలమునఁ గమలముంపఁగఁ
గమలద్వంద్వంబులోనఁ గమలము పుట్టెన్
గమలంబు గలిగి వరరుచి
కమలజ కంధరనుజూచి కరుణను బలికెన్.

తా. హస్తము — ముఖము — నేత్రయుగము — జలము — హృదయ
ము, శంఖము.

క. క్రోలితి నీయధరరసము
సోలితి నీస్తనము లెదను పోకదయాబ్ధిం
దేలితి నీవిటు జాలిం
దూలితివని నామమంబు తోలుగ్రసదెనే.

వ. అని ప్రియాణను వర్జించి తనకోలుపుకూటంబు నలంకరింప సభాసదు లాతనివిలోకించి మీానయనంబు మూగిన హేతు వేమగ నన్యతంబునకు లౌకికమునకు విరుద్ధంబు గాకుండ నిట్లనియె.

మ. శతపత్రంబులకు న్నిశాకరునకు న్సఖ్యంబు గల్గె న్మహో
ద్భుతమానట్లుగఁ గైరవాప్తకములై పూర్ణించె ముక్తావళుల్
శతపుష్పాప్తనిభాముముంబురుహకోశద్వంద్వసంగంబున
న్గతమున్నాడఁగ నీవిరుద్ధములచేత న్మానిని న్పైనముల్.

తా. హస్తపద్మము — ముఖచంద్రుడు — కనుగల్వలు — అశ్రుబిం
దులువు — ముత్యాలహారము — కుచయుగము.

వ. ఇట్లు వరరుచి పలుక సభికులు సంతసించిరి. ఆవార్త విని ప్రియాణము మానుకొనుటకు హేతు వేమన నామెను జూచి,

చ. నయముగ నంటిబోదె నొకనాళము బుట్టి చిగిర్చెఁబైఁ గుశే
శయరిపుఁడుండ రక్తయుత సారసయుగ్మమునంగుఁ బుట్ట నం
దుదయమున పుట్టి మేరువున తోరముగాఁ బ్రవహించినాళ ము
న్నాయగతిఁదాఁక మాఁసితిఁ బ్రమాణవిచారములో పిప్పియంవదా.

తా. ఊరువు—హస్తము—ముఖచంద్రుఁడు—నేత్రపద్మములు—
అశ్రుప్రవాహము—స్తనపర్వతము—మధ్యము.

వ. ఇట్లు పలుక భర్తను గాంచి తప్పక వెళ్లుమన భార్యను వరరుచి
చూచి,

క. ఉంగరము నొసఁగి దీని శు
భాంగీ నావలెను జూడు మని నుడువుచుఁ దా
రంగున నగ్బరుసభకు
న్మంగళవాద్యములతోడ మహీపతి చనియెన్.

వ. భార్యకు తనవ్రేలి ముద్రిక నిచ్చి యుందు వాద్యవిశేషంబు సె
లంగ ఢిల్లీనగరంబున కేతెంచి సకలదేశాధీశులచే భాసిల్లెడు పా
దుషాసభ బ్రవేశించిన వచ్చిన నరవరులనందరిని పాదుషా సగౌ
రవంబుగా నహాసనంబులం గూర్చుండ నియోగించి భూలోకం
బునంగల జవ్వనులలో పతివ్రత లెవ్వరో వినఁదలంపు వాడమె
నది నివారింపుఁడన వరరుచి సభాంతరంబున నిలువంబడి,

తే. సుక్రమతులారా వినుడీ సభలో సొంపుగ వచింతు నాదు
సతి పిప్పియంవద మహాపతివ్రత సందియ మింతుక లేదు.

వ. ఇటులం బలుక పాదుషాయొక్క ప్రధాని లేచి వరరుచినిజూచి,

చ. సతిసతి నీసుబుద్ధికిని సంతసమందిరి సభ్యులందరు
న్థరఁ దమకీర్తిసంపదఁ దామె వచింతురె యీనృపాలు లీ
సరణిఁ బ్రతాపముల్వలుకఁ జాలక యుండిరె చాలుజాలు నా
సురుచిరగాత్రి సద్గుణముఁ జూచెద నావుకు నాతఁ డుగ్రుఁడై.

చ. సరసిజనేత్రి దోషములం జక్కఁగ నెన్నకయున్న మంత్రి భా
సురమగు నుత్తమాంగమును జూర్ణముఁ జేయుటకు న్మరిన్దలో
దన దురితాత్మయైనను దదాకృతిఁ బొందుటకు న్వచించె నా
వరరుచి వేగ లేచి సభవారు మహాద్భుత మొందునట్లుగన్॥

వ. ఇటులం బ్రతిజ్ఞం జేయ నరుపురు నోడంబడిక వ్రాసికొనిరంత నా ప్రధాని ప్రియంవదనగరంబున కరుదెంచి తగినంత ప్రయత్నముం జేయం జిక్కమిని ప్రియంవద కుపచారంబు లొనర్చు దాసీస్త్రీలకు తగినంత ద్రవ్యం బొసగి యామె నిద్రించుచున్న గృహంబునందున్న పటములు మొదలగునవి జాబితా వ్రాసుకొని మగనివలన భార్యకొసంగిన ముద్రిక రప్పించుకొని యన్యపురుషులకలవిగాని ప్రదేశంబునందు గొన్ని చిహ్నములు వీరిపలన నెరింగి తన్సభకేతెంచి ప్రియంవదతో గమనించినట్లు తెల్పి యాగురుతులన్నియుం దెల్పి విశ్వాసంబనియెంచి వరరుచి శిరస్సు ఖండించు నాజ్ఞనియ్య నంత సభాధ్యక్షునింజూచి మీరారు విధించిన శిక్షకు లోబడితి జామాతుగుండగు చోళపురాధీశుని జాఖిరానుఁబెట్టి నేనొక్కపర్యాయము నానగరంబున కేగివచ్చెదనని సెలవుగొని వచ్చుచున్నంత భర్తరామిని ప్రియంవద సఖీజనులంజూచి.

బేహాగ్-ఆది.

౧. నరపతి సభకేగి, నాథుడింక రాడాయే॥నర॥

౨. మరియు నావిభుని క్షే। మముఁ దెలియదాయే॥ నర॥

౩. త్వరగవచ్చెదనని, తానువెళ్లిపోయెనే। కురువిందాధరి నా। ల్గునెలలాయెనే॥ నర॥

౪. కరివరగామిని నా, కాంతుఁడు రావేగమే। వరబాలాజీనేలె శంకరునిఁ బూజింతుమే॥ నర॥

వ. ఇట్లు చింతించుచున్నంత భర్తవచ్చిన సంతసించి,

పున్నాగ-త్రిపుట.

౧. నిన్నుఁజూడఁగఁ గల్గెనా, యిన్నాళ్లకు॥ నిన్ను॥

౨. నిన్నుఁబాసి యెదారు, నెలలాయె నామోహనాంగా ॥నిన్ను॥

౩. సదయ నిన్నటిరేయి, నిదురించఁగఁ గలలో। నెదుట నిలిచినట్లుండ॥
ముదమునఁ జూడఁగానమి। మదిని జింతించుచుండ మద్దయమున
నెవ్వరి। వదనముఁజూచితినో। కుదురుగ బాలాక్షి నేలిన యమ్మ
నారి దయచేనేటికి॥నిన్ను॥

వ. ఇట్లని.

ఉత్పలమాలిక.

రాసుత భర్తయెద్ద ననురాగము పుట్టినటుల్ తలంచి నా
నాసుమబాణతాప విభవాతిశయుం డిటుల న్వహించెనో
బానలమూరి నీపనులు బాగుగనిట్టి వంచిపనేల నా
హా సఖి నీసుశీలతను నగ్బరుమంత్రి యెఱుంగనేక సం
తోసముగల్గె నీశిరము దుంచిన పాప మొకింత లేదు శా
బాసును భృత్యవర్గమును బాలనఁ జేయును నింటిలో నిరా
యాసముగా వసింపు మహాహా బక రాజును నమ్మి మత్స్యము
ల్గాసిలినట్టి రీతి నిను గైకొని దండన బొందితిం జెలీ॥

వ. ఇట్లు పలికి యచ్చట జరిగిన వృత్తాంతం బంతయు నెఱింగించిన నామె చింతాక్రాంతయై నేనేమియు నెఱుంగననవది నమ్మి వారికి వాగ్దాన మొసర్చిన రీతి నేతెంచెదనని చనిన నంతనామె నాభర్త లేని యీవిభవంబేల రాజ్యంబే భర్తతో సహగమనముఁ జేయ నిశ్చితాత్మయై గఁచని శంకరసంకల్పంబున నొక యూహావాద మి నగరంబునం బ్రవేశించి రాజులశేఖరుండగు వరరుచి యాస్థాన సభావినోదంబుల సభారంజనం బొనర్చెడి హేమలతయను నాటకకోటిని తత్పురాధీశుం డగు నగ్బరుపాదుషా సన్నిధంబునకు

చారునివలన వర్తమానముఁ బంప నతఁడేగి యాచక్రవర్తి డెందం బానందానంద మొంద తత్సుందర చరణారవిందంబులకు వంద నములాచరించి యాకృత్రిమవారసారసనేత్ర వక్కాణింప నంత నప్పాటలాధర యాటపాటలఁ బరిశీలింప సభకు రావించి యనుజ్ఞ నీయ నంత ప్రియంవద తన విద్యాప్రౌఢిమ నెరపందొడఁగె.

సురట-ఆది.

సయ్యాటలకు తగినదిరా, అలవయ్యారి నినురమ్మనెరా ॥సయ్యా॥

౨. నెయ్యారు నీడవుల నను బ్రతిమాలిన
జయ్యన నీసన్నిధికి నను వచ్చెరా। సయ్యా॥

౩. ముద్దుగారు మదవతి వదనంబు ముద్దుగారుప్రియంబు ముద్దియ మారుని సుద్దులఁదెల్పను। వద్దకు నిను రమ్మనెరా అది ముద్దిగ దయనుంచుమనెరా, చెలి ముద్దులిగ్గె నమ్మనెరా బుద్దులురా। పెద్దలురా। తగినవిరా నగినవికాళినిగోను ॥సయ్యా॥

౪. రాజసమానము నేలినసడలు। రాజసమాజమెజడలు రాజముఖి యు వీణను వాయించి। రాగంబుఁ బాడగలదిజవ్వాజిని నీమేనలది, పద। రాజీవములకు వెలఁది జాజులదీ। పూజలదీ। చతురతతో। డతిరతతోఁ జేయును ॥సయ్యా॥

౫. కాకోదరమనఁదగు చనుతీరు। కాకోదరమేయూరు శ్రీకరమాని హృదయవాసా, పాలితబాలాజీదాస, అది నీకేతగినదియీశ, నిం దోకొనిరమ్మని దోష। సారత్రోషా కరమోషా, రత్నము నన్। యత్నమునన్ బనిచెను। సయ్యా॥

వ. ఇట్లు పాడి యాడ సభికులందరు విస్మయంబంది రంత చక వర్తి హేమంతను దిలకించి.

సీ. తిరుగ మేప్రటా ద్రిప్పినట్లొకచోట
నురుజాన్వ లెగసినట్లొక్కచోట

ని వచ్చెఁగాన నతనిఁ గంటిర। ధర నిట్టివార లుండిర। మునుపె
న్నఁడైన వింటిర॥ మానవ॥

వ. ఇట్లు హేమలత పలుక మంత్రి కోపంబున హేమలతం గని,

బేహాగ్ — ఆదితాళము.

చాలు చాలు నోరుముయ్యవే॥ చాలు॥

౨ బాల। రోవినుము పేరోల। గములోన
నీలీలఁ। బలుకు టిది వీలా। నీకు మేలా॥ చా॥

౩ చాన। నీమొగమెన్నఁడైన। నాలోకించి యు
న్నాన। యన్నృత మింతలోనఁ। గూడున॥ చా॥

౪ యిమ్మ। హీన వేశ్యల నమ్మ। గూడదందురు
జుమ్మ। యీమాటసార్థకమ్మ। మె నోర్కమ్మ॥ చా॥

౫ మాలి। మిగి బాలాక్షి చేలి। నట్టి వర త్రి
శూలి। మె సాక్షి వెలయాలి। కంగాళి॥ చా॥

వ. ఇట్లు మంత్రిపుంగవుండు పలుక నక్కాంత.

ఉ. ఎంతటివాఁడవయ్య మొగమెన్నఁడుఁ జూడఁగ లేదటంచు ధీ
మంతుల సన్నిధానమున నూనుగ నోరెటులాడెనింక కా
వంతయు సంశయింపకయె స్వల్పపుమాటలు నన్ను నాడ సా
మంతము నీకు నెట్లొదవె మంత్రియనంగను నీకుఁ జెల్లునే.

వ. ఇట్లు హేమలత పల్క చక్రవర్తి గాంచి,

శా. ఓరాజన్యకుమార నేడు వినుమీ యొడ్డోలగంబందులో
నాగూఢిన్వచియింతు భూపతులకున్ వ్యాజ్యాత్తు సంశంబు శ్రీ
గారం బొప్పెడు నంచుఁ గోవిదులు వక్కాణింపఁగా వింటినో
ధీమద్గ్రేసర నీవు రాజగుట నాదివ్యాంశముండుం జుమీ.

క. కావున భవదూరుపద రా
జీవంబుల సాక్షిగా సచివవరుఁ డెపుడు

న్నావదన మెఱుఁగనని యీ
కోవిద సముఖంబునఁ జెప్పఁగోరెద నధిపా.

వ. ఇట్లు పలుక నామంత్రి సమ్మతించి చక్రవర్తి పాదములపయి కరంబుంచి,

ఉ. ధీవరులంత చూడ భవదీయపదాబ్జము లంటి పల్కెద
న్భూవర పంచభూత సురపుంగవ పద్మజదానవారి శ్రీ
భావజవైరి శీతకర భానుల సాక్షిగఁ జూడలేదు నే
నీ వెలయంగ నా సుఖము నిచ్చుట తప్ప మరేస్థలంబునన్.

వ. ఇట్లు ప్రమాణంబు జేయ హేమలత మునుగిడి చక్రివర్తిం గాంచి తండ్రివద్దకు బిడ్డలు వచ్చుట కభ్యంతరము లేదు. కావున మీరు దండ్రిలగుటన్ భవదీయదర్శనార్థంబు వచ్చితి. నా మనోరథం బీడేరు నందియుం బేమియు లేదు. ప్రభువులు న్యాయాధిపతు లగుటం జేసి విన్నవించెద వినుండు.

కీరవాణి— ఆదితాళము.

రాజా రవితేజా। యో॥ రా॥

౨. రాజాశ్మశిరోజ।తనుజితమనోజ।జితరిపుసమాజ।సుజనసురభూజా॥

౩. పేరు ప్రియంవద యని యందురు వినుమా। యీవరరుచి కూరిమి ధర్మకళత్రిను నిటుగనుమా। చోళదేశరాజ కుమారిని మీ మంత్రి వచ్చి యెవ్వియో।మాట లనేకము జెప్పఁగపతిపై నేర మోంచి వారియనుపుఁదియగ నిశ్చయించినట్టు। వినగ విచారించఁగ బాలాజిబ నొప్పిచిన శుభము నాతట్టు, దయఁగని యీరీతినిపడచిన నీవిభుడు జేరునాచు గడచిన రేయి కల। లోరయమునఁజెప్ప, మీదరి। జేరితినోయప్ప, పేరిమితో నాకిఁక బతిభిక్షను పెట్టుము త్వరపట్టుము, మాకుఁ గట్టుము॥ రాజా॥

౫. ఇటుల ప్రియంవద పలుక,

ఆ-వె. విరులవాన కురిసె వేడుక మోడ మం
  దుభులు మొరసెనపుడు నభమునందు
  సభికులెల్లఁ జాల సంతసంబున నీప్రి
  థాన దోషుడనుచుఁ దనరఁ బల్కె.

వ. ఇవ్విధంబున జరుగ మంత్రియందు దోషమారోపించి మంత్రికి శిరచ్ఛేదం బొనరింప నమకట్టియున్న ప్రియంవద పాదుషా నాలోకించి రాజశేఖరా భవదీయ ప్రధాని దుష్టస్వభావుండవుట నిటులొనరించె. నాప్రార్థన నంగీకరించి మంత్రికి నియమించిన శిక్షయు మాన్పుడన నామె సుగుణతతికి రాజమండలి మిగుల నానందింప సచివున కీవెలంది కోరినరీతిమన్నించి వధూవరులగు వరరుచి ప్రియంవదలను మిగుల గౌరవించి వారి నెలవులకంబంప వారలేగి సుఖాసీనులై ప్రజాపరిపాలనంబు లాలసంబుగ జేయుచు నశ్వేశ్వరు నిట్లని వినుతింపందొడంగిరి.

తోడి—ఆదితాళము.

శంకరా పాపభయంకరా। ఆశ్రితభక్తవ
  శంకర పాలితకింకర। సంకటహార॥ శంకర॥
౨. శంకశేల బాలాజిపిలిచిన మీ
  నాంకహార శ। శాంకధర, వృష, భాంకవర॥ శంక॥
3. ధరణిరథముగను రవిశశి। యారథాంగములుగను
  మేరువు విల్లుగను బిలువల। మేటినారిగను
  హరియుశరముగను, వాణీ। వరుఁడు సారథిగను
  వరవేదంబులు హయములుగఁ బూనిచి
  బిరబిరఁ జని,త్రిపురములను విదళించిన॥ శంకర॥
వ. మరియు,

నవరోజు — జంపెతాళము.

నీ మహిమలు గనుఁగొన నెవరితరముగా। బ్రోవ రావేమిరా। త్రిపురహర॥ నీ మహిమలు॥

౨. సోమశేఖరా। మంగళాకరా। స్తుతవశీకరా। శ్రీకర। రిపుభీకర కరుణాకర॥ నీ మహిమలు॥

౩. నే ననగా నెంత। పూనికగా మంత। నమున నినుఁగన్నఁ। గొను టకు మును। లును నినుఁగనుఁగొన లేరు వను॥ నీ మహిమలు॥

౪. సామజవరదవినుత ధృతసా। రసవైరి గౌరీముఖసారస। సారస హితగుణసా।కర సామజచర్మవసన।నగజానుసద్వం। సా, వర బా లాజీదాస, పోషక భక్తానిరాస, జితసుమ। సా, యకరిపుసా, మజకేసరి, నీకేసరి, బ్రోచెడు కీర్తి భాసురమూర్తి॥ నీ॥

వ. ఇట్లు శంకరునిఁగూర్చి ప్రార్థించ పార్వతీ సమేతుఁడై హరుండరు దేర వరరుచి ప్రియంవదలు వారలంగాంచి.

శ్రీరాగం — ఆది

నినుఁ గని ధన్యుల మైతి॥ నిను॥

౨ అనఘ భూమిస్యందన, రిపుభంజన మునినుతసంక్రందన, కృతవందన॥ నిను॥

౩ ఈశా, వరకాశీనగర నివేశా, విధృతప్రభంజన ప్రాశ, బాలాజీదాస, క్లేశనాశనాకేశ సర్వేశ॥ నిను॥

వ. మఱియు పార్వతీదేవినిగాంచి,

ఆనందభయిరవి — ఆది.

పార్వతి, పరమానందభయిరవి॥ పార్వతి॥

౨ శర్వరీశ శేఖరునిరాణి, పర। చంచరీకసంకాశవేణి, య ఖర్వగర్వశత్రువనకృపాణి, కీరవాణి, కిసలయపాణి, పరమకళ్యాణి॥ పార్వ॥

౩ కంబు, కంధరనీపదయుగళంబు, ననిశమునాహ్వాత్పద్మంబు, న
డితిగాన సమయంబు, కనికరంబు, శేదాబంధరకచనీకనవనా
ఖగంబు నందు దిక్కెవ్వరు గుణ కురుంబ పాలిత బాలాజీ కాద
బ యూననుగ్రోవుము మూన, వతీబిరా॥ పార్వ॥

వ. ఇట్లు వినుతించ గౌరీశంకరు లావధూవరులం గాంచి మీ భ క్తి
మెచ్చినాము గనుక వరంబులగు వరంబులు వేడుండన దేవ
ఋహా సౌఖ్యంబులన్నియు ననుభవించినారముగాన శాశ్వతాన
వ మొసంగుడన వారలబుద్ధికి సంతసించి యుభయంబౌసంగ వ
దుచి ప్రియంవదలకు సాయుద్యంబిచ్చి చనిరి.

శ్రీ శ్రీ శ్రీ

హిందూస్తానీకాఫి — త్రిశ్రిలఘువు.

హరా, మంగళంశశిశేఖరామంగళం, పుర
హర, మంగళం, గంగాధరామంగళం॥ హరా॥

౨ శివామంగళం, జితాంగభవామంగళం, గౌరి
ధవామంగళం, హతశాత్రవామంగళం॥ హరా॥

౩ రుద్రమంగళం, నతనిర్నిద్రమంగళం, కృపాస
ముద్రమంగళం, సజ్జనభద్రమంగళం॥ హరా॥

౪ ఈశమంగళం, గగనకేశమంగళం, కలుష
నాశమంగళం, వినుతరమేశమంగళం॥ హరా॥

౫ లీలమంగళం, బాలాజిపాలమంగళం, దయాల
వాలమంగళం, ధృతత్రిశూలమంగళం ॥హరా॥

శ్రీప్రియంవదా చరిత్రము

సంపూర్ణము.